# పరిచయం



సంఘంలో మార్పుని సహించలేనివాళ్ళూ, మార్పుని ఆహ్వానించే వాళ్ళూ ఉన్నట్లే కవులలో కూడా ఈ రెండు తెగలవాళ్ళూ ఉంటారు. ఇందలి రెండో తెగ కవులలో మొదటి శ్రేణికి చెందిన వాళ్ళలో ఒకడు శ్రీ రమణారెడ్డి.

సంఘంలో పెట్టుబడిదారీ విధానలిఉంది. దానికి పెట్టనికోటలుగా నిలిచిన పత్రికలూ ఉన్నాయి. కవిత్వం గురించి వాటికి కొన్ని ఖచ్చిత మైన అభిప్రాయాలున్నాయి. వాటి ప్రకారం కవులను తులతూచే తూకపురాళ్లు ఈ పత్రికలవాళ్ళదగ్గర ఉన్నాయి. ఈ కొలమానాలతో కొలిస్తే రమణారెడ్డి కవికాడు.

వీరి దృష్టిలో దస్త్రాలకొద్దీ చాదస్త్రాలను తమకు సుపరిచితమైన చంపూ పద్ధతిలో సంగ్రథించ గలిగినవాడే మహాకవి. దేశకాలపాత్రానను బద్ధాలైన శాశ్వతమైన చలనంలేని స్థలనంలేని విలువలేవో ఉన్నాయని వీళ్ళు జాలిగా నమ్ముతారు. ఆ విలువలను తమ ఆరాధ్యదేవతలలో చూస్తారు.

భాష మారుతోంది. భావాలు మారుతున్నాయి. ప్రజలు మారు తున్నారు. ప్రభుత్వాలు మారుతున్నాయి. అయినా ఈ మూడు కాళ్ళ కుందేళ్ళ హక్కుదారులు మాత్రం తమ వాదాన్ని వదలుకోరు. తెలు గులో గ్రాంథిక భాషకు ఏనాడో కాలదోషం పట్టిపోయింది. అయినా మన నిండు సున్నా కవులు అరసున్నాలను పట్టుకొని వేలాడడం

మానరు. వీళ్ళలో ఒక్కడికి కూడా ఈ అర్ధానుస్వారాలను గురించిన్నీ, శకటరేఫలను గురించిన్నీ పూర్తి భోగట్టా తెలియదనడానికి వీళ్ళ రచనల్లోనే కొల్లలుగా ఉదాహరణలు దొరుకుతాయి.

వీళ్ళూ, వీళ్ళని వెనకేసుకొని వచ్చేవాళ్ళూ ప్రస్తుతం నిరాఘాటంగా సాహిత్య వీధుల్లో విహరిస్తున్నారు. పత్రికలు వెలువరుస్తున్నారు. పైని పేర్కొన్న భ్రష్టగ్రాంథికంలో క.త్వం గురించి అనుశాసనాలు చేస్తున్నారు.

ఈమధ్య ఒకాయన గురజాడని "అకవి" అన్నాడు. ఔనుమరి. గురజాడ డెబ్భయి పదకొండోసారి రామాయణాన్ని తర్జుమా చెయ్యలేదుగా. గురజాడ రచనలన్నీ కలిపి అచ్చువేస్తే ఆ పుస్తకం తలగడాలాగయినా వాడుకోడానికి వీలులేదుగా

గురజాడని తెలుగు ప్రజలంతా ఏనాడో తమ మహాకవిగా అంగీకరించారు. ఆయనకి కవి సమ్రాట్టు - కవి చక్రవర్తి - కవి సార్వభౌమ ఇత్యాది బిరుదులులేవు. రాచరికం అనే వ్యవస్థకి రాజకీయంగా ఏనాడో మన దేశం స్వస్తిచెప్పింది. అయినా రాచరికపు అవశేషాలకు నిదర్శనాలయిన ఈ బిరుదులు ధరించే కవులకు మాత్రం నీరాజనాలు పట్టడం జరుగుతోంది. నిసలైన ప్రజాస్వామ్యవాది మాత్రం ఈ బిరుదులను వినగానే వీటిని ధరించినవాళ్ళు క్రీస్తుపూర్వపు మనుష్యలని సులభంగా గ్రహించగలుగుతాడు.

నేటి ఇరవయ్యో శతాబ్దపు ద్వితీయార్థంలో "శ్రీలు పొంగిన జీవగడ్డ"యిన పరమ పవిత్ర భారతదేశంలో అక్కడా ఇక్కడా, అప్పుడూ ఇప్పుడూ నరబలులూ, సహగమనాలూ వంటి ప్రాచీన వ్యవస్థకు చెందిన మనస్తత్వాలకు సంబంధించిన క్రియా కలాపాలను జరిపిన వ్యక్తులను గురించిన వార్తలను వింటున్నాము. ఆ వ్యక్తుల విషయంలో ఏ విధంగా జాలిపడతామో అలాగే నేటి కాలపు ప్రాచీన కవులను చూసి కూడా అనుకంప వహించవలసి ఉంటుంది.

"అంగార వల్లరి" రచించిన శ్రీ రమణారెడ్డి ఎటువంటి కవికాడో ఇంతసేపటిదాకా చెప్పడమయింది. అయితే ఇతడు ఎలాటి కవి?

ఆధునికాంధ్ర కవిత్వంలో అభ్యుదయోద్యమానికి మూల స్తంభాలుగా చెప్పవలసిన కవులలో ముఖ్యుడు రమణారెడ్డి. మొట్టమొదటిసారిగా "అడవి" అనే ఖండకావ్య సంపుటితో ఇతడు ఉద్యమ నిర్మాతలలో ఒకడుగా అగ్రశ్రేణిని నిలిచాడు. సమకాలిక సాంఘిక వ్యవస్థను అగమ్య గోచరమైన అరణ్యంగా గుర్తించి, అందులోనే నాగరికత విలువలను స్థాపించగల "చక్కని రాజమార్గాలను" నిర్మించాడు. నాటినుండి నేటి వరకు రమణారెడ్డి కవిత్వం ఆటవిక మనస్తత్వానికి గొడ్డలిపెట్టు. నాగరిక మానవునికి నవ్యనీరాజనం.

రమణారెడ్డి పదును ధారల తీవ్రతకు తట్టుకోలేనివాళ్ళు రకకాలుగా అతన్ని విమర్శించారు. వాటి అన్నింటికీ జవాబులు చెప్పడం అనవసరం. కవికి ఆవేశం ముఖ్యమని వేనోళ్ళ ఘోషించే విమర్శకులు రమణారెడ్డిలో జాజ్వల్యమానంగా ప్రకాశించే ఈ "ఆవేశ గుణాన్నే" దుయ్యబట్టడం ఒక విచిత్రమైన విశేషం! తాను ఏవి అన్యాయాలనుకుంటున్నాడో, ఏవి దురాచారాలనుకుంటున్నాడో వాటిమీద రమణారెడ్డి తీవ్రమైన వీరావేశంతో విరుచుకుపడతాడు. మీకు చేతనయితే అవి అన్యాయాలు కావని నిరూపించండి. అవి దురాచారాలుకావని సమర్థించండి. అంతేకాని అడ్డదార్లంట పోయి రమణారెడ్డి కవితా వాహినిలో రాళ్లు రువ్వబోతే అవి అప్పటి మట్టుకు కొంత అలజడి కలిగించే ఆవర్తాలను సృష్టించినా ఆఖరుకి మాత్రం అడుగంటిపోతాయి.

ఆధునిక కవిత్వంమీద తరుచు వినవచ్చే ఒక పెద్ద ఆరోపణవుంది. అదేమిటంటే ఈ కొత్త కవిత్వంలో "కథావస్తువు" ఉండదని. చెప్పుకో దగ్గ "కథ" అన్నదేమీ లేనప్పుడు ప్లాటు, పాత్ర పోషణ, కథనశక్తి ప్రదర్శన ఇత్యాదులమీద తెగడుతూనో, పొగడుతూనో విమర్శ సాగించ డానికి వీలుండదుకదా! "విరాట పర్వంలో ద్రౌపది", "అయోధ్యా కాండలో మంధర", "మనుచరిత్ర ద్వితీయాధ్యాయంలో పెద్దనార్యుడు

చూపించిన ప్రతిభా విశేషాలు" వంటి అనుశీలనలు సాగించడాని కలవాటుపడిన విమర్శకులు నిరుద్యోగులు కావలసిందే. ఇక రసం ధ్వని, వ్యంగ్యం మొదలైన పడికట్లు వాడడానికి అసలే వీలులేదు. అందుచేత నేటికాలపు కవిత్వం వీరికి కొరుకరాని కొయ్యగా, గొంతుకలో వెలక్కా-యగా ఇబ్బంది పెడుతుంది.

నిజమే కాని దీనికి సమాధానం వెదకడానికి రెండు మూడువందల సంవత్సరాల పూర్వంకంటె ఎక్కువ పోనక్కరలేదు. అంతవరకు ఇంచుమించు అన్ని దేశాల సాహిత్యాలలోను గ్రంథాలన్నీ ఛందోబద్ధంగానే సాగుతూవచ్చాయి. వాటిని పురస్కరించుకొని విమర్శగ్రంథాలూ, అలంకార శాస్త్రాలూ వెలువడ్డాయి. (అవికూడా పద్యాల్లోనే). నాటి పద్ధతులకు అలవాటుపడ్డ విమర్శకులు నేడు కవిత్వంలో వస్తూన్న బ్రహ్మాండమైన మార్పులను గుర్తించలేకపోతున్నారు. ఇదివరకు పద్యాల్లో చెప్పిన ఎన్నో విషయాలు ఇప్పుడు వచనంలోనే వస్తున్నాయి. అంతేకాక కవిత్వం అనేది సాంప్రదాయిక చ్ఛందస్సులలోనే సాగనక్కరలేదని వచన కవిత్వం ఋజువు చేస్తోంది.

కథ కావలిస్తే, మీరు నవలలు చదువుకోండి. కవిత్వానికి కావలసింది. కథావస్తువుకాదు. కావ్య వస్తువు. ఆరు ఆశ్వాసాల గ్రంథంలోనే రసాధిదేవత సాక్షాత్కరిస్తుంది కాని ఆరుచరణాల గీతంలో ఉండదను కోవడం పొరపాటు. గురజాడ దేశభక్తిగీతం ఒక్కటీ ఒక మహాకావ్యం. (కాదనేవాళ్లు ఉన్నారులెండి. వాళ్ళనే పాతరాతియుగపు మనుష్యులనడం!)

క్రిస్టొఫర్ కాడ్వెల్ మీద, ప్రేరేప, గాదిరాజు, అనామధేయులయిన అమర పజావీరులమీద రమణారెడ్డి వ్రాసిన ఒక్కొక్క గీతం వెనుక ఒక్కొక్క మహాభారతగాధ ఉంది. అర్థంచేసుకోగలిగినవారికి, అన్ని, పూర్వాపర సందర్భాలూ తెలిసినవారికి అదంతా కరతలామలకమే! కాని మరికొందరూ వ్రాశారు అమరజీవి పొట్టి శ్రీరాములు దివ్యస్మృతికి అనీ, త్యాగమూర్తి (ఎవరు చెప్మా? పేరు జ్ఞాపకం రాకుండావుంది) ఫలానా వారి ఆత్మశాంతికి అనీ; వాళ్ళని అడగండి, శ్రీ శ్రీరాములుగారి అడుగు

జాడలను మీరు అనుసరిస్తారా అని ! అబ్బే. అదంతా కవిత్వం. మొన్న కమీషనరుగారికి బదిలీ అయినప్పుడు పంచరత్నాలు రాయలేదూ ! అంతే ! అంటారు.

ఆడగండి రమణారెడ్డిని ! నీవు విశ్వసిస్తున్న సత్యాలకోసం, సాంఘిక వ్యవస్థకోసం, సాంస్కృతిక జీవనంకోసం పోరాడిన వీరులని అనుసరిస్తావా అని !

"ఓ తప్పకుండా ! వాళ్ళలాగే జీవించడానికి సిద్ధం ! వాళ్ళలాగే మరణించడానికి సిద్ధం !" అని రమణారెడ్డి జవాబిస్తాడనడానికి సందేహం లేదు.

అందుకే మళ్ళీ అంటున్నాను. రమణారెడ్డి కవిత్వం నవ్య మానవుని అభ్యుదయానికి దివ్యనీరాజనం !

మద్రాసు
31-8-59

శ్రీ శ్రీ

# తొలిపలుకు



'భువన ఘోష' కావ్యసంపుటి వెలువడిన నాటినుండి నేటి వరకు పత్రికాముఖాన ప్రచురించిన కొన్ని కావ్యఖండికలను, 'అంగార వల్లరి' రూపాన లోకంముందు వుంచుతున్నాను కావ్య సాహిత్యానికి ఆదరణ క్షీణిస్తున్నదని తెలిసికూడ, వుత్సాహబలంవల్లనే, యీ సాహసం చేస్తున్నాను.

'భువన ఘోష' గురించి వెలువడిన సమీక్షలలో కొన్ని నాకు లేని వుద్దేశాలను ఆపాదించి, నేను సౌందర్య కల్పనకు విరోధిననే భావాన్ని పాఠకులలో కల్పింపజూచాయి. ఉబుసుపోకకు, చాల తేలిక మనస్థితిలో వ్రాసిన "ఆంధ్ర కవిత్వ చరిత్ర" అనే ఖండిక నొక్క దానిని తీసికొని, మొత్తం సంపుటిని ఖండించబూనాయి. నాటికీ నేటికీ ఆ విమర్శకులకు సమాధానం యివ్వడం నా అభిమతంకాదు. కాని నాపై మోపబడిన ఆరోపణలను, సుందర భావకల్పనద్వారా తొలగించుకొని, విద్రోషిగా లోకంముందు విలువవలెననే నా సంకల్పం.

నేను వ్రాసే కావ్యఖండికలలోని శైలి చాల మంది పాఠకులకు కొరకరానికొయ్య అవుతున్నదని నేనెరుగుదును. సంస్కృత పద బాహుళ్యమును గురించి అనేకులు నాతో చెప్పినారు. సంస్కృత పద ప్రయోగం గురించి నాకు మోజుమట్టుకులేదు. పాండిత్యాన్ని చూపుకో వలెనని నా కోరికకాదు. ఒక్క రూపంతోకాక, అనేక రూపాలలోవున్న

ప్రకృతిని వాచ్యం చేసేటప్పుడు, ఆ రూపాలకు అనుగుణమైన భావాలను, శబ్దాలను కవి స్వీకరింపక తప్పదని నా అభిప్రాయం. కఠినపద ప్రయోగంవల్లనే యీ పని సాధింపబడుతుందని నేననను. కాని పదాల పరుపు, సమాసపు కూర్పు, వాక్య విన్యాసంలో మార్పు – యివి ఒక నిర్దిష్టమైన భావ ప్రకటనకు తోడ్పడుతాయని నా నమ్మిక. పాఠకులను దృష్టిలో పెట్టుకొని, కావ్యం చివర, కఠిన పదాలకు అర్థాలను వ్రాశాను. ప్రతి ఖండికలోనూ నేను ప్రదర్శింప దలచుకొన్న మూలభావాన్ని కూడా కొద్దిగా వ్రాశాను.

"అంగార వల్లరి" అని యీ కావ్య సంపుటికి పేరు పెట్టడంలో నా వుద్దేశంయిది: నైరాశ్యం నిండారిన లోకం చీకటి కానుగ మ్రాని వంటిది. కాని చీకటి కానుగ పూగుత్తి యెర్రనిది – నిప్పుకణికలవలె నిగ్గు లొలికించేది. అదే అంగారవల్లరి. గతంలో జరిగిన అనేక పోరాటాల్లో ప్రాణాలు విడిచిన ధర్మవీరుల స్మృతి మనకు అంగారవల్లరియై, ఆశను, విశ్వాసాన్ని, దృఢిమను కల్పించగలదు. ఈ కావ్య సంపుటిలోని ఖండికలు అధికభాగం ఈ వీర సంస్మరణకే అంకితమైనవి.

ఈ ఖండికలు ఎక్కువగా "అభ్యుదయ", "విశాలాంధ్ర", "ఉదయిని", "స్రవంతి", "సందేశం" పత్రికలలో ముద్రింపబడినవే. కాని వాటిని కొన్ని మార్పులు చేయక తప్పలేదు. ఆ పత్రికల సంపాదకులందరికి నాకృతజ్ఞత. నమస్తే!

కావలి కళాశాల,
కావలి.

కే. వి. రమణారెడ్డి

★

# మనవి

శ్రీ కె. వి. రమణారెడ్డిగారి 'అంగారవల్లరి'ని ఆంధ్ర అభ్యుదయ రచయితల సంఘం పాఠకులకు అందించుతోంది. ఏది కవిత? ఏది కాదు? ఏది అభ్యుదయం? ఏది కాదు? ఇలా వాదోపవాదాలు, రోకటి పాటలా పదే పదే కొనసాగుతూనేవున్నా, ప్రగతిని ఆపడం ఎవరికీ సాధ్యంకాదు. ఎవరు ఔనన్నా కాదన్నా, అభ్యుదయ రచయితలు తెలుగు సాహితీ లోకంలో ఒక విశిష్ట స్థానం ఏర్పరచుకొన్నారు. అభ్యుదయ రచయితల సంఘం మన సాహిత్య సంస్కృతీ పునరుజ్జీవనంలో ప్రముఖ పాత్ర వహించింది. సమాజ ప్రగతికి కంకణం కట్టుకొన్నది.

శ్రీ శ్రీ మొదలుకొని నేటి యువ్వరచయితలవరకు అముద్రితంగా వున్న వారి కావ్యాలను సంకలనమొనర్చి క్రమక్రమంగా ప్రచురించడమే అభ్యుదయ ప్రచురణల ఆశయం. అందులో తొలియత్నం ఇది. త్వరలో శ్రీ శ్రీ "ఖడ్గసృష్టి" మొదలైనవి ప్రచురించదలిచాం. కథానిక, నాటిక, నాటకం, నవలలవలె నేడు గేయ కావ్యాలకు విశేషాదరణ లభించనిమాట నిజమే. అంతమాత్రాన వాటి విలువ తగ్గదు.

ఉత్తమాదర్శ ప్రేరితమయిన ఈ కావ్యాన్ని పాఠకలోకం సమాదరించుతుందని ఆశిస్తున్నాం.

విజయవాడ,
1-9-'59.

తుమ్మల వెంకటరామయ్య,
కార్యదర్శి, ఆంధ్ర అభ్యుదయ రచయితల సంఘం



# ఆవాహన

సరళాలు వర్జించి సరసాలను త్యజించి
పరుషాలు సంధించి రోషాలను కదించి
సప్తపర్ణాల్ పూన్చి
సప్తస్వరాల్ కూర్చి
లే వేసవి రవీ లేవో జగత్కవీ
లేవే!

తప్తసింధువు లిపుడు రక్తబంధువు లప్పుడు
నాడిలో హయధాటి మేనొక్క శరధి
క్లృప్తాక్షరముల సం
భృతమహోర్ధముతోవ
లే యూష్మనిశ్వసన లే ప్రభావసనా
లేవే!

గౌరవ మెగబ్రాకి గ్రీవమే మార్మ్రోగి
అశ్రువుల వింకించి ఆక్రోశవని గాల్చి
గుండెతిత్తిక వెట్టి
గూటి దడ పోనెట్టి
లే సవ్య మార్తాండ అంశుకోదండా
లేవే!

దేహాలనుండి సందేహాల చెమటోడ్చి
నేత్రాలలో ఖచిత నిర్ణయాల్ బింబించి
సమరకోశమునుండి
జడవాక్కులం ద్రుంచి
లే సాహసోద్యోగబద్ధాంతరంగా
లేవే పతంగా !

తమసాలయమునుండి జ్యోతి గన్పరచి
శోకమయ లోకమున కాశ గన్పరచి
శైత్య సంహత వనుల
జీవ మగుపరచి
లే ప్రాణ సంత్రాణ, జీవాగ్నిధానా !
భూషాజ్వలత్ప్రభా, భూపాల దీపా
లేవే !

# ఇగుళ్ళు

అలలు అలలుగా
కలలు కదిలె నా మదిలోన!

జగాల తరువున
ఖగాలు గూళులు నిలిచేనా ?

ముదిసిన మాపటి
ఎదలో చీకటి చెదిరేనా ?

యుగాల తీగలు
ఇగుళ్ళ కెంపులు తొడిగేనా ?

సరాగమే సుమ
పరాగమై వర్షించేనా ?

క్రిందికీ భువికి
పందిరియై దివి వంగేనా ?

విలాప గీతిక వీగేనా ?
విరోధ వీచిక లాగేనా ?

# అగ్ని పుష్పం

వర్షించు అశ్రువులు
　　　పొర్చు జీవాస్త్రములు
లేకున్న యీ కచ్చ
　　　అందు మొలువదు స్వేచ్ఛ

శాసించు చీలికలు
　　　ఈసులను జ్వాలికలు
లేకున్న యీ కచ్చ
　　　అందు నెగడదు స్వేచ్ఛ

అతుకు మనుజుల మనసు
　　　నేస్తమే మన దినుసు
లేకున్న యీ కచ్చ
　　　అందు పూయదు స్వేచ్ఛ

ఊర్ధ్వముఖమై హృదయ
　　　క్షేత్రాలలో ఉదయ
చైత్రమై చిత్ర వ
　　　ర్ణాంచిత సుమాళ్వీరియ

అశ్రువులు అస్రములు
　　　రంగరిన రసధునులు

మనసులను నులివేరు
చిరు నెలవులం జేర

అగ్గి మొగ్గలు తొడిగి
నిగ్గు కొమ్మలు సాగి
చివురేని చేవగా
ఖరి విచ్చు కత్తిగా

దివ్య సందేశమై
జీవనావేశమై
సౌమ్య ప్రకాశమై
కల్ప సంకాశమై

తన నీడ గొడుగుగా
తన విరుల్ వశములై
తానె భూ భాగ్యమై
తన పిందెబంధువై

పసరాకులే చలువ
ప్రజకు చలు వీయగా
మనుసు గావుత స్వేచ్ఛ
మనుచు గావుత స్వేచ్ఛ!

# బాధాగాధము

వేధించే సందేహాలకు సమాధానాలను నీ నీలి మెదటి పొరల వెనుక,
అలలగుండె అరల వెనుక, శోధిస్తాను;
గోదావరీ, అందుకనే యీ అద్దమ రాతిరిపూట వచ్చాను.

గద్గద గళనాదం నాది, నీ చెవిలో గలగలా సెలయేళ్ళ దూకుళ్ళలా, చొరబారబోతోంది; హృదయక్షేత్రాన పంకరదారి తొలుచుకో బోతోంది, నీ భావ నీరంధ్రవనుల దూరబోతోంది, నీ యెడదకు తూములు తెరువబోతోంది.

కురుక్షేత్ర రణాంగణం వంటి నీ వుపరితలాన్ని పరిశీలిస్తే, మృగ రక్తంవలె వుద్రిక్తమైన నీ నీళ్ళ నీలును పరికిస్తే, శిథిలవస్తు శకలశ్మశానమో, నృత్య విశృంఖలసంరంభమో, స్ఫురిస్తున్నాయి నాకు.

కొత్త కొత్త సత్యాలు దర్శన మిస్తున్నాయి; గోస్తనీ రసంవంటి నీ స్తన్యాన గరళం కళపెళ మరుగుతున్నది: నీవు నీవు కావు; ఎవరవో అయ్యావు, ఎందుకో మారావు.

ఉదయం, వన్నెల నిట్టూర్పు దొంతరలవలె వూరేగి వస్తుంటే, దట్టపు చలి పరదాలు విరవిర విచ్చుకొంటూవుంటే, పసిపాపల కలవరింతలువంటి కలకలారవాలు నీ గుండెను కొంచెంకొంచెం కదుపుతూవుంటే, నీ ముంగురులు రేగి తడిగా వూగుతూ వుంటే, మున్యాశ్రమ పరిసరాలలో విరియబూసిన చేరదేసి చామంతుల చెండ్లు నీ కొప్పున దూస్తావెందుకు, దానసపూలు దాచావెందుకు ?

నీ లోచనాంతసీమలో పాదరసపు మెరపు బాకులు మీదికీ క్రిందికీ పరు గెడుతా యెందుకు, నీ కనుకెంపులు కురిపింప మానావెందుకు ?

వేగువేళ, పాలిన నీ ఫాలాకాశమందు ఒద్దికలేని రంగుల అద్దకపు మడుపులు ముడుచుకొని, ఉదయానికి అణగి అంతరించా యెందుకు ?

# 2

కీళ్ళు సళ్ళి యేళ్ళు చెల్లి కదలజాలక, నీపై నాపై సమస్త భూతలంపై కూలబడిన కాళరాత్రి అనే చిల్లులుబడిన గొంగళి, ఊపిరి నడిమి వుక్కిరి బిక్కిరి చేస్తున్నప్పుడు,

ఇప్పుడైనా నీ నచ్చుతనం ముచ్చుతనం విడిచి, నీ అచ్చపు రూపు చూపుకో నాకు ! కాలపు మంత్రగాడు కలయజల్లిన చుక్కరపల మచ్చుపొడి విదుల్చుకో, నిన్ను విప్పుకో.

నీ రాత్రి బ్రతుకు తేటతెల్లం చేయవు; అడిగితేనే ముఖపుష్పం మొగ్గైపోతుంది; ఎడ, పెడ అవుతుంది.

కాని లోకానికి చెవులున్నాయిలే, నీకు నీడ ఉన్నాయిలే, నీ గుట్టు రట్టయిందిలే,

పాపి కొండల కావల, నిజాం గజాంకుశం కాలేదూ నీవు ? కోనసీమలో లంకసీమలో పాపాల దీపాల నార్పలేదూ నీవు ? విచ్చుకత్తుల బోను రెక్కలు త్రుంచలేదూ ? రాత్రిని కప్పుకొని ధాత్రిని మప్పు కొని చరించలేదూ నీవు ?

భద్రాద్రిరాంభజనల చప్పట్ల వెనుక, నీ చేతి కతికిన కనక తప్పెట్లతో, అటవుల గాటపు నిదురదుల్లి, గుండె గుహలు దద్దరిల్లి, పూడని గోయి బొబ్బపెట్టి, నాళాలలో నెత్తురు లేడి ముంగాలి వడివలె చెంగలించి లగెత్తగా, కసుల్ కాగడాల్ కాగా, కరాల్ ధ్వజాల్ కాగా, విక్రమించలేదూ నీవు ?

నీ ముకు జెరమలో యిరుకు కనుమలో, నల్లమల తలమీది ములుకు గాడుపులు, లోకం సమస్తం వినింది కాదూ ?

# 3

అఖండమై అనంతమై యీ అరణ్యావాసం ఎన్నాళ్ళమ్మా నీకు? ఎంత నెత్తురని ఎత్తిపోతలు పోయగలవమ్మా నీవు? ఎంత త్యాగం, ఎంత బాధ చేయగలవు, మోయగలవు? యౌవన పుష్పం, దళందళం నేల రాలి, మంటబడి, గోతిలో చెడి పీడిపోతుంటే, సహనత్రాణ కొంచెం కొంచెం సన్నగిల్లిపోతూంటే, ఎంతకాలం చింతలు గతుకుతావు, వంతలు తాలుస్తావు?

నీ నీటిమలల్లో వన్నెల పన్నెల మిన్నాగులవంటి బడబాశిఖలు, చనుబాలకు దిగువతట్టున, ఎఱ్ఱని నరాల గజిబిజి. ఇంకా అట్టడుగున ప్రాణమూలానవున్న, నిర్వర్ణమైన అశాంతతను పైకి తోపనీయక, ఎన్ని కట్టు దిట్టాలు!

ఆకురాలు కాలం ముమ్మరించగా, అమవసనిశి నింగి వుయ్యాలలోనుంచి రక్తరూపులైన తనూజులు శూన్యం తొలచుకొని నీ నాడుల వాడి తీగలమీద రాలి, ఘనీభూత దంభోళులవలె మార్మ్రోగుతూవుంటే.

వైక్లవ్య రహస్యంవలె నీ మోము కొయ్యబారింది; కాని వేయి రవికలను వ్రచ్చి, వేయినొక్క కడుపులలో చిచ్చుల నెగద్రోసే బాధా గాథా సప్తశతి లోలోన. శబలోద్రేకతతి కలిచేను, ప్రేవులు మెలిచేను, గుండెలు తొలిచేను, నెత్తురు తోడేను!

ఆలోచనలతో ఆవేదనలతో విప్పారిన నీ నీల నయనాలలో పడి దిరిగే సుడి నీళులు

విమోచన వియన్మణీ జ్వర తీవ్రాతపలగ్నాలై, భంగాలు శతధా భగ్నాలై, ఉల్లం వుల్లోల కల్లోలమై పోనేమో గోదావరీ, ప్రశాంతంగా వున్న, అశాంతమైన గోదావరీ.

నిరాశనుండి ఆశకు ప్రవహించే మానవ రుధిరాశ్రు బిందు నిబిడ నిర్ఝరీ!

[పేరిరేప మృత్యుంజయుని అక్షత స్మృతికి]

# గ్రుడ్డిసంజ

ఆంధ రథ్యములు పూన్చుక
అంబరవీధుల మీదుగ
అరుగుదెంచినది సంధ్య
అంత్య సంధ్య అపర సంధ్య....

అంత నొక్క రెప్పపాటు
గంత కట్టుకొన్న మబ్బు
చుక్క జిలుగు రెక్క తూల
నాగువంటి జాబిల్లి - మి
ణ్ణాగు మెలికబోలి....

వికసించిన వియద్వనము
విహ్వాలించు తమసము;
విస్తరించు విచారమున
జాలివంటి జాబిలి - క
న్నీళ్ళ పడవబోలి....

చివురించిన జుత్తు విప్పు
జేసి నల్లమందు మత్తు
తెలివితప్పి వియత్తు....

# చిట్టడవిలో చిన్నారి

ఉరలి ఉబికి నేస్తున్నది ఉప్పెనయై ముప్పు
కెరలి పొరలి దూకుతోంది కేసరివలె కీడు
చిట చిటమని రగులుకొంది చిరతల కను నిప్పు
పటు రయమున యెగబ్రాకి పడెను వల్లకాడు.

ఓడెను వసంతము వాడెను లతాంతము
గ్రీష్మము భీష్మించె నదే
ఊష్మ ముత్క్రమించెను.

ఇది మనుగడలకు బరి
ఇది దాటిన మెడలకు వురి!
బరి దాటకు వురికందకు
ఇరుకు చెరను చొర బారకు!

మనుగడ తీయము తప్పినదా
మృత్యువు ఆవేశించినదా
బ్రతుకు చిక్కుముడి విప్పుటకా
కత్తి?

చూడుము నీ చూపు లందు
చూతశాఖి చివురించెను;
వన్నెల వెలుగుల వేడుక
వాంఛా కేళీ వాటిక.

# 2

పిచ్చి ముచ్చటలతో ప్రొద్దుపుచ్చుతూ, వెచ్చటి వేడుక నాశీర్వచనాలు సల్పుతూ, కుర్రగుండెలనుండి కోర్కె గుత్తులు దూస్తున్న ముద్దరాలా !

మగని వేళాకోళాలలో నలిగి, యెకసక్కెలకు అలిగి, కొంచెం ముని కోపం కొంచెం చిరుచెమట కలగలిసి ఫాలాన క్రొందళుకుల మిణుగురుల నంటగా, శశిరేఖను గర్భాన పోషించి పాలిన పడమరవలె అలిసి, తెరపిలేని తీపికోరికతో మురిసే జవరాలా !

పెనిమిటిని కూర్మితనయునివలె చెలికానివలె యెంచుకుంటూ, వండు కుంటూ, తింటూ, కంటూ, వెళ్ళే మగనాలీ !

ఎండవేసిన పచ్చితోలువంటి గగనం దిగువ, అగ్నిని నిశ్వసించే ఘూవృషభ మూపురాన కూర్చుని విహరించే పశుపతీ !

లోని మురికిని చిక్కటి కారుపొగగా వెలువరించే మందపనిసాలలలో మరకలుపడి, అరిగి, తరిగి, కృశించే విశ్వకర్మా !

నేల బిలములో, కలుగులో పామువలె దూరి, ఘోషాణాలవంటి పాషాణా లను పలుగుతో పారతో తూటాతో సమ్మెటతో ప్రక్కలించి ఆదిశేషుని ఫణామణులు మణుగులుగా కొనితెచ్చే కర్మిష్ఠీ !

భూగర్భం చాళ్లు చాళ్లుగా చీరి, దాగిన తొలియామని తుది సత్తువ వెలువరించి, తరుగెరుగని పూర్ణకుంభ మందించే శీరీ !

లోకం పన్నీట జలకమాడునుగా నని చెమట మడుగులో మునిగే శుభ్రహృదయుడా !

నీవు కల్పించిన చిత్రవస్తుశాలకు చిమటలుపట్టి, చెదగొట్టి, నకనకలాడే జీవుడు, విలవిలలాడే ఆత్మారాముడు, సతమతమయ్యే బిడ్డడు

నీకు మిగులగా. సౌఖ్యకర్తవై దుఃఖభోక్తవైన నానా దారిద్ర్యావతారుడా, బలభద్రుడా, నిస్సహాయుడా, అశ్రుసింధూ, విగత హితైషిబంధూ, అన్నా, చిన్నా!

ఓయీ ఆఫీసరూ, గుమాస్తా, పహరా బంట్రోతూ. పుస్తకాల పురుగూ, రంగ మార్తాండా. పదవీ తపస్వీ.

దేశీయులారా, విశ్వ కుటుంబీకులారా, వర్ణాలూ వర్గాలూ, శిఖరాలూ, కూటాలూ దూరిన రక్త శాఖలారా!

ఇవ్వండి జవాబు; ఇవ్వండి జరూరు; కొండను ఢీ కొంటున్నారు; వెనుదిరిగి పోలేరు; చేతులారా చేసికొన్నారు! మంటల వెంటి నడుమ చిక్కుకొన్న బెదురు కళ్ళ లేళ్ళు: వివశ నృత్య సంరంభాన మిన్నుల వెన్ను చరిచే పిడుగును మరచిన నెమళ్ళు; నిర్దయుడైన బోయవాని కపట జాలికలలో కూర్చుని కను మొరిగే పావురాలు :

ఆసన్నమవుతున్నది పేరులేని వికృతి; గురితప్పి పడుతున్నది వికట జ్ఞాన విక్రాంతి!

కొరియావలె ఎర్రనైన చనుబాల మడుగు, హిరోషిమావలె హఠాత్ ఛిద్రమైన యవ్వన కేళీవనం, గ్రీసువలె ఘోషాభీలమైన యమ చెర, మలయావంటి తెగిపడిన తలలో మెదిలే తుదిలేనికల, స్పెయిన్ వంటి పసిపాప మొండెపు తుండేలు, లెబనాన్‌వంటి కుప్ప గూలిన చుక్కల రవ కప్పు, జోర్డాన్‌వంటి బలిసి ఒట్టిన పొదుగు. ఆజ్ఞాపిస్తున్నాయ్ మిమ్ము! ఇవ్వండి జవాబు!

వాతం ఆవరించి. ప్రాణం ప్రచలించి. కాంతి విక్రమించిన యీ గిజిగాని గూటిలో చలువజేసిన దమయంతి పచ్చ చీరలవంటి పల్లెపట్లు, తేనె తెట్టెలవంటి పట్టణాలు, నృత్య భంగిమలవంటి పంటచేలు,

వియచ్చరలవంటి పచ్చిక బయళ్లు, బిడ్డలవంటి మందలు, స్వరా రోహణావరోహణల వంటి మిట్టపల్లాలు, వాన కారుమబ్బులు దిగి మేసే వనాల గాటపు పచ్చనలు, ఆశలవలె అంది యందని నెలయేళ్ళు, ఉద్రేకాలవలె వుండి వుండి వుబికి దూకే నీటిబుగ్గలు, యిస్కూళ్ళు, హోటేళ్ళు, బజార్లు, ఫేక్టరీలు, గోదాలు, గ్రంథాలయాలు, అనాధ శిశుశరణాలయాలు, ఆస్పత్రులు, వంతెనలు, తంతితీగెలు - విస్ఫారిన వేయి రేకుల విరివంటి యీ సృష్టి - బుద్ధికల్పించిన ఈ విశ్వామిత్ర ప్రతిసృష్టి - ఏమి కాబోతున్నది ?

పిడికెడు బూదిబుగ్గిలో సమస్త వసుంధర కుబ్జయై, కురూపియై, క్రిమిగర్భియై కుదించుకొని పోవలెనా ?

వాయువు ప్రాణహరమై, ఘుర్ఘురారవఘోరమై, వ్యాధివాహకమై, విరోధించవలెనా ?

జలం జ్వరారుణితనేత్రప్రవాహమై, శమంతపంచకమై రోదించవలెనా ?

శిథిలాస్థులవలె నగరాలు, పశుకోష్ఠాలవంటి గృహాలు, అయ్యో, దురంతమనే వైతరణికి ప్రఫుల్లయవ్వనారోగ్య సౌందర్యస్రవంతులు వుపనదులు కావలెనా ? గర్వోన్నత నరమస్తకశిఖరిణి విరిగి అగాధాన పడిపోవలెనా ?

నిలిచి చూస్తున్న కనుపాపల వరద శపిస్తుంది, మృగం అపహసిస్తుంది జాగ్రత్త !

ఊబిలో పడబోయే దాంపత్య సౌఖ్యాలు, మన్మధ తాపాలు, వాత్సల్యాలు, శుశ్రూషలు, నైపుణ్యాలు, వీణాతంత్రులు, గజ్జెలందియలు, కావ్య వాసనలు మిమ్మ బాధ్యులను గావిస్తున్నాయి !

చెమ్మటతో నెత్తుటితో కన్నీటితో తడిపిన చవిటి పర్రమీద యిసుకపొరలమీద గట్టి మట్టిమీద పాదాలను ముద్రించుకుంటూ, సితాసితమిశ్రిత మహా ప్రభారాశివలె, అనాదిలో బయలుదేరి అనంతానికి

పయనించే జగజ్జనులారా, ఘనులారా! కసాయిశాలవంటి దక్షిణానికి, తప్పితే ఎముకల పాతరవంటి ఉత్తరానికి అభిముఖులై పోతున్నారు. దారి తప్పినారు, జాగ్రత్త!

తోరజాల్ తోరజాలుగా ఘోర మారణ ప్రమాదాలు మేధస్సులను తప్పించుకొని, నీతి కట్లు త్రెంచుకొని, మిన్నులలో క్రమ్ముకుంటున్నాయి నేడు! పచ్చిగాయాలను కెలికే రాబందు వుక్కుముక్కుకొన భూమిపైకి దూకి వస్తున్నదిపుడు! లోన లోహ కవచం ధరించి, పులిగోళ్లు తాల్చి, రెండవచేత కత్తి దాచి, బూచి మీ హస్త స్పర్శను కోరుతోంది; వియద్వీపద్వీధినుండి సీసం జడి కురువ బోతోంది!

ఇరుకు వంతెనల నడి పుంతలో, ఎగుడు దిగుడు తికమకలో, మిడిమేలపు అంబోతుల కూచి కొమ్ముల నడుమ నిలిచి, దిక్కులను వెదికి, దేవుళ్ళను తలచి నోట మాటరాక, రెండు చేతు లెత్తి నిలుచున్న అన్నదమ్ములారా! సాధుశీలులారా! పసి పావురాపిట్టల కను నీలాలవంటి అమాయకులారా!

ఎత్తండి కంఠం! ఒత్తండి శంఖం! ఒప్పం మేం ఒల్లం ఈ యుద్ధం! ఓర్చం మేం కూర్చం యీ ఛిద్రం! జీవం మా భావం! సౌందర్యం గేయం! విరి మా గురి! వికాసం మా లక్ష్యం! నది మాగతి!

శాంతి కాంతి కాంతి శాంతి!

# క్రిస్టొఫర్ కాడ్వెల్

పండలిన ద్రాక్షకు మధువందించే
శీతోష్ణస్థితి యిచట;
వగచే స్వేచ్ఛకు వుసిగల్పించే
తెగింపు తెంపరు లిచట:
వాడికొమ్ములను బరిలో యెదిరే
వృత్తి నైపుణులు యిచట;
విడుపులేని దాస్యగ్రహణములో
విలాసాలు మను నిచట;
        స్పెయిన్ స్పెయిన్ ధ్వజమై నీ మేన్
        రావించెను నీ దరికి లోకమున్.

శౌర్యం బిరుదై త్యాగం పథమై
జయం జీవమై పోరి,
కర మాయుధమై తేజం ధ్వజమై
విరివిగ నెత్తురు కురిసి,
గిరులే యిల్లై శిలల్ శయ్యలై
పరభూములలో మసలి,
స్వేచ్ఛయె భాషగ సహనమె భూషగ
దేశదేశములు మెలిగి;
        బ్రిగేడ్లు బ్రిగేడ్లు ఒకపై పగళ్ళ
        మృగాల హృదయాల్ మిగిలాయ్ పగుళ్లు:

చీలిన కప్పులు కూలిన కుప్పలు
నీలి దారిలో ముప్పు,
పాలిన ముఖాలు పాసిన సుఖాలు
పురం వెలుపలే దుఃఖం,

ఆరిన కన్నులు జారిన చెన్నులు
ఒరిగిపడే కార్మికున్న,
మునిరే భీతులు మూల్గే గోతులు
మూర్ఛవంటి రాత్రిళ్ల :
స్పెయిన్ స్పెయిన్ చిక్కె నడకత్తెరన్
జర్మనీ, ఇటలీలు జట్టుగా నొక్కాన్.

మసక వెలుగులో వెలుగు ముసుగులో
మధ్యాహ్నానికి దిగువ,
మరిగే సీసం కురిసే గగనం
పరచే బాంబుల నడుమ,
పూర్తి స్పృహలో నిస్పృహ గుహలో
ఆర్తికి తృప్తికి నడుమ,
వచ్చు చావులో చావు వుచ్చులో
విచ్చిన రెక్కలు ముడుగ,
కాడ్వెల్ కాడ్వెల్ నుడియు నీ కనుల్
అవియును స్వప్నాల్ అడలును ప్రాణాల్

జాబిలి కన్నుల పడతి, లోర్కా
కవిత లేడుపుల ఫణితి,
యువవీరుని శిథిలాంగం, గుండెలో
చివరతొల్చు విషకీటం,
కొండలూడి పెంధూళి, చెవులలో
రింగుల గిటారు రవళి,
రగుల్కొన్న నరరక్తం, కనులలో
లగువెత్తేటి ప్రవాహం :
దిర్దిర తిరిగే బొంగరం నీశిరం, క్రిస్టోఫర్ !
వదలని వెలుగుల నది మేచీకటి నీలో, కాడ్వెల్!

# విశ్వవత్సల

త్రల్లీ.........తల్లీ........
　　తారా కోరక తరళిత వల్లీ!

నీ యెదలో చిరు తరగ లూగెనా
ఆయుర్వాహిను లవతరించవా!
నీ కొస చూపుల నగవు సాగెనా
జగాలు వెలుగుల జిలుగు దాల్చవా!

నీ యొడి ప్రేముడి నేర్పే బడిగా
నెన్నుడియే యొక నీతి బోధగా
నీ నును తాకిడికీ నరలోకము
వన్నెలు చిన్నెలు విప్పారేనా?

నెన్నుదురున ముది మిన్ను చాళ్ళలో
ఎన్నో జగాలు మూగినవమ్మా
నెరిసిన కేశము నిగ్గుల పోగై
విరిసి వదనమే అమృత సదనమై!

మా కొరకని నీ కార్చిన ధారల
నొకటిజేయ వినువాక లురలవా?
మా పతనమ్మున నీ తడి యూర్పుల
పేర్పు కట్టి సుడిగాడ్పౌను కదా!

వీరులమని ధాత్రీశులమని మా
క్రూరులు మీసాల్ పడద్రిప్పెదరే !
హాలికులకన్నా శూరులుందురా !
చెమటలకన్నా నెత్తురు మిన్నా ?

ఘోరునడుమ జడివాన కురిసినా
కలహము కౌగిలిలోన ముగిసినా
నీ విరి కన్నుల విరివి కాదటే
చివురు గుండెతడి పరసు కాదటే !

పంటపొలము పీనుగ తుంటలకా ?
పనిసాలలు చెరసాల లగుటకా ?
పెంపు సొంపులా తెంపు రంపులా
ఏ మార్గము సన్మార్గము తల్లీ ?

వాసలు కోనల్లు పాపలు పూపలు
పిట్టలు పశువులు పుట్టలు పొలాలు
నీ రూపే నని నేర్చితి మమ్మా !
నీ సంతే నని యెరిగితి మమ్మా !

పాలబాటలో పాలబుగ్గలో
కలకలమందున కిలకిల లందున
కలలో మెలకువలోపల నీవే
ఇలలో మినుమిలమిలలో నీవే !

తల్లీ...తల్లీ....
లలిత తారకా కుసుమిత వల్లీ !

# అంగారవల్లరి

కాళరాత్రి కంకాళ ధాత్రిలో
మేళతాళ సంకుల రవ మేలో ?
శిథిలాలయమున శశి కళ లేలో
వధా వీథిలో వినోద మేలో ?

...గాలిలో సుడిసి దీపా లడగిపోవు
పూల పొంకా లుక్కు పాదాల జెడవు
జ్వాల పాలయ్యె నిర్ఝరమగు తీగ నగవు
కాలువలు గట్టేను కన్నీటి నురువు...

ఊపిరి సలుపని వుక్క వేళలో
విపిన వకుళ సురభిళ మాలికలో ?
వడదెబ్బకు స్పృహ సడలిన భువికై
తడి గాడుపులై తరలి వత్తురో ?

....వలకాటి సందిట వీరాసనాలు
నెలలేని చదిలింట నడ కాగడాలు
ఉలికిపడు పొదరింట నురుకు బెబ్బులులు
కలతబడు చెరువులో చిరు తరగ తెరలు

ముది చెంగలువల నొడిచినస్సైనా
మలి సందెల కెంపులను పిండినా
కారుచిచ్చు జడ బారు కూర్చినా
ఈ రగిలే నెత్తుటి కీడౌనా !

...వెన్నెముక యొక్కొకటి వజ్రపుముక్క-
కన్నెఱ్ఱ యగ్నిశిఖ కండ రాబండ
దున్నిన చాళ్ళలో దూకి పడగలవు
మిన్నేటి యడుసులో గ్రొన్నన లగును...

మిడిసే యెఱ్ఱటి యెండలెవైనా
తడి యారని సెల నడపగల్గినా
మైసోలించే మైకపు వెన్నెల
ఎద పెంజీకటి విదలించేనా ?

...తారకలు వలదు తారళ్యమెది వలదు
కారునల్లని నిశా కంబళము తాల్చి
వెలుగులను వేడుకలు వెలివేసినాము
మలయానిలాంకూరముల. మరచినాము...

చివురేనియు కడు జేవురించునో
నివు రేనియు నిప్పై వెలిగేనో
అంజనాద్రి భంజింప వజ్రి దో
ర్దండయుగళి దంభోళు లాయెనో ?

....వీరా నీరాజనమువలె వరలె తూర్పు
వీర కిమ్మీర వర్ణావృతము మిన్ను
వీర శంఖారావ మురలించె గాడ్పు
వీర మద్దెల దిధిం ధీం కృతము మబ్బు...

పూలగాలి తోలేటి చేలలో
పాలదారి తేలేటి రేలలో
పూతకారు మామిడి తోపులలో
ఊటలూరు సెలయేటి దాపులో.

....అంగారవల్లరి అగ్గలించినను
మందగంభీరఝరి చెంగలించినను
గరుడపచ్చల గరిక గరుకు బారినను
గురకతీసే గోయి ఘూర్ణిల్లనేని...

ఏ సమాధిలో ఎట నీ వున్నా
ఓహో యన ఓ హో హో యనుమన్నా!
కడుపున పిండము కదలిన నీవని
ఏడి తడి యూర్పులు నిగుడ్తుమన్నా!

....తలిరాకు కరకెక్కి తడిబాకులైన
వలి తాకిడికి కంది ఒళ్ళు రగిలినను
కొమ్మ కదలబారి కొమ్మా్మెదెనేని
రెమ్మ రెక్కాని పచ్చరెక్క లార్చినను

ఏగి రా జెరలోగిట నీ వున్నా
ఓహో యన ఓ హో హో యనుమన్నా!
తనేవేళ పొరబోయిన నైనా
కన్నేటికి కరగల్లే లేపన్నా!

...స్మృతి కల వరప విస్మృతి మీకులేదు
ఋతు చక్రగతి చైత్ర ఋతు వొకటి కద్దు
కథలల్లు కౌశలము కొరతవడదేని
వ్రతనిష్ఠతో పికీ గీతి వెల్వడును ..

మీ తీరని కలమాగి సాగి మా
బ్రతుకు మింట రోజాలు నింపదో?
మీ శయనించిన నిర్జల ధరకే
కిశోర గర్జా నిర్ఝరి రాదో?

[హత ప్రజావీరుల అమృతస్మృతికి]

# విలయ వీచిక

ఘోర రుధిరోద్గారి యౌనా
చరిత చేదు కత యౌనా!
ఆశల తారకల గుత్తి
కోసేనో కటిక కత్తి!

పడి లేచెడి గాడ్పు పంట
కవితా ఝరి వికలమౌనా
వాఙ్మయ మొక బీడౌనో
కళలు వల్లకాడౌనో!

కన్యక కౌటుక రేకల
కనిపించే శిశు కామస
హఠా దంతరించెనో!
హృదయాలపదపద యౌనో!

తల్లుల పాలిళ్ల విరిసి
ఉగ్గబట్టి విలపించునా!
సిగ్గు బుగ్గి పాలౌనో!
శ్రీలు చివికి పోయేనో!

శ్రీకంఠుని గళములోని
లోకాంతక గరళము ధుని
వోలె వెడలి సుడి దిరుగునా!
కలలు విలా విల లౌనో!

సులభ కోపియైన మౌని
వలె మిన్నులు శపించునో !
గాలి జాలి మాలేనో !
నీక మురలి పొరలేనో !

కాల మనెడి పిలి జ్వాల
పూల రాశినే చెసటునా !
గల గల మను పాటల సెల
యేళ్ల చవుడు పాలౌనో !

నిదురించే మృగపు పులి
హృదయమందు రొద జేయునా !
మెదడు దండించేనో !
వీథి విహ్వాలించేనో !

భావి యనెడి బావిని పడి
జీవి ఆత్మ హంత యౌనో !
జలములు గర్జించేనో !
జముడు దుర్జయుండౌనో !

# రత్న దీపం

నరాకారుడై శేషుడు శిరమొక్కటియే దాల్చెను
ధీరత్వము కూడగట్టి పురుషుడాయె సర్వంసహ
దిట్టతనములేని చిట్టిపొట్టి చేతులూనెను గిరి
సతీశవము తేలికయని మదినెంచెను పరమశివుడు
భూభారముదీర్ప చతుర్భుజుడు ద్విభుజుండాయెను
భూమిజబ్బుమాన్ప దేవ భిషగ్వరుడు చనువెంచెను.

లోనున్నది సందేహము లోనున్నది భయము
లోనున్నది తగనిరోత లోనున్నది చపలత
లోన వజ్రసంకల్పము లోన రత్నదీపము
లోన కఠిన కారుణ్యము లోన కటిక ప్రేమము
కాలికి యెద పెను సంకెల కాలికి మది విడుదల
కాలిముందు ఒక తప్పెట కాని వెనుక తటపట.

ఇది తగనిది యిది తగినది ఇది యోగ్యము కాదిది
ఇది న్యాయము అపాయ మిది ఇది తుచ్ఛము ఉచ్చము
ఇది వాసన యిది తనుగతి కా దెవరిది అందరిది
ఇది ఆత్మవినాశకరము ఇది జనమంగళము ।
తనలో నొక పాతాళము తనలో సురలోకము
తన మదిలోపల డోలిక తను పటుయిటు కదలిక.

ఊరు ససేమిరా అనెను ఊరు చేయి వేయననెను
ఊరువారి కింటి ఖైదు ఊరి కూరు వేపచేదు

ఊరు మందు తింటున్నది ఊరు పిరికి తింటున్నది
ఊరు వ్యక్తులై విడినది ఉమ్మడి శక్తే చెడినది
చుక్కమ కన్నార్పుకొనెను ముక్కు నొక్కుకొనె గాడ్పయ
ప్రక్కలించినాడు గోడ బిక్కుబిక్కుమనెను చాయ.

ప్రాకుతున్న వల్లకాడు పరుగుదీసి పైబడితే
చిగురెత్తే వేప గుబురు జేవురించి గోలెడితే
దొంగల కులకని కుక్కయు దురతరాక పసిగడితే
దుమ్ము మింట సుడిసి మిన్ను తీవ్రిస్తే తీండ్రిస్తే
ఊరి గొంతు విడదు దిగులు, ఊర రాత్రి పగలు
ఊరు తీరుబా పెరుగదు ఊరు పనికి జొరదు.

ఊరి గమిటి తోరణాలు ఊగి మోగి దడిపిస్తే
అర గూర్కిన కన్నులు విడ నర్ధరాత్రి బుసగొడితే
మోరసు నిక్కించి కుక్క పేరెలుగున విలపిస్తే
నీరుబారి మేక కంటి తెరల కత్తులే తోస్తే
అమ్మవారి క్రినొసటి అగ్గిబారుగుళ్ళు
అమ్మవారి మిర్రునొసట నగ్గలించు కళ్ళు.

గుంటకళ్ళపడి తోడేల్గుంపు లబో లక్ష్మణయన
గుంటనక్క యెండుడొక్క క్రుంగుడుపడి యెముకలంట
రాబందుల వుక్కు ముక్కు రాపులేక కరకుమాయ
శవక్షామ మేర్పడెనని శ్మశానమే సొక్కిపోవ
జలమొక వలికిలిమిట్టై జలమొక రక్కసి పోటై
జలచరాలు భూజన సహజీవనాని కెగబడినై.

చేప కూడ ఛీ గొట్టెను కప్ప తిండి నొప్పననెను
చాపలోని కళేబరము చవుకబారి చులకనబడె

సాగరు డీ పట్టున రత్నాకరు డనిపించుకోడు
సాగరు డుప్పును కూరిన శవాకరుడుగా మారెను.
జలము జలదరించుకొనెను జలము గుండె జారెను
జల సమాధి మహాచితో జ్వరపడి పొంగేను.

## 2

అపర సంజ పసిమి మిసిమి అడుసునంటి పోయెను
గపర గపర చీకటిలో గగనము రవ జల్లెడ
రే జీకటి తొలగి గూబ రాజేసెను కనుచితి
గజగజమను కాకుల చిరు గుడ్ల ప్రాణభీతి
సగం జగం ఎన్నెమదర మాగిన నేరేడుపండు
చీకటి గిజిగాని పిట్ట గూటికంటె మెండు.

గ్రామపు తలమీద కారు కంబళిపరచె నింగి
గ్రామపు మేనంత ముళ్ళగాడ్పు కంపభంగి
గ్రామపు కంఠాన వేప గుళికపంటి భీతి
గ్రామపు కనులందు సిరా దిమ్మరించు రాత్రి
గుడి వాకిటి మూగగంట గణగణ లాడేను
గుడి లోగిటి రాతినాతి గడ గడ వణికేను.

గుడి ముంగిట విడువబడిన ఒది అనాథశవము
గుడి ముంగిట వీడి పడిన చవి కుళ్ళిన ఫలము
గుడి వెలుపట రాశిపడిన క్రిమిసమూహ మున్నది
గుడి వెలుపట కూరుకొనిన గబ్బిలు నెల వున్నవి
గుడి దేవుని ప్రార్థించెను గుడి సహాయ మర్థించెను
గుడి వూరికి మ్రొక్కుకొనెను గుడి విముక్తి నాశించెను.

# 3

కంపించిన గుండె యిపుడు కంచుబండ అయినది
సంశయాన నలిగిన యెద సంకల్పించినది
కాలికి చెరతప్పి తుదకు సేలమేన నొప్పి
కాలము శిలవోలె నిలిచె కనులపెంపు పప్పి
అడుగడుగున ఒకటొకటిగ పడినవి గుదిబండలు
అడుగడుగున ఒకటొకటిగ విడినవి బంధాలు.

దూరము వైదొలగిచనెను భారము సులువాయెను
మరపు మసకలావరించి ఎరుక మందమాయెను
మునుముందుకు సాగె కాఌ మీరి జీవలోకాలు
మూపు క్రుంగిపోవునట్లు మృతి తనపై వ్రాలు
బుజంమీద చావుచేరి పోయినది సవారి
గజం గజం క్రమించి నడచి గుడి నెమ్మది పరచి.

•

వెరాము చెమటగా కరిగెను ముక్కు దండడించెను
గ్రాసు మశ్రుజలనయనము గద్గద గళనాదము
ఒకటి నాలుగాయె బుజము ఒక్కటి శతిశ్వసనము
నిక్కిన శిలవోని మేను స్రుక్కి విశీర్ణిల్లెను
బూజర చీకటి మిణుగురు బూమలతో చూచెను
బూరాలూదెను వెదుళ్ల బాజాలు కీచురాళ్లు.

కాటిమోము వికసించెను కాటికి నోరూరెను
కాటి సొంపు విప్పాయెను కాడుచేయిచాచెను
నక్కలు త్రొక్కిసలాడగ వృకము వాయివిచ్చగ
వ్రక్కలించి గట్టిమట్టి ఒకగుట్టై పడగ
పార రోజి రొప్పిపూడ్చె పురుగులసూ పురుషుని
పాదము దట్టించె మన్ను పనికి చేయి తెమిలెను.

వెంద దపుడే కల దెలిసెను అదవదయో నెదద
మెదిలెను అసులలోపల మెరపులవలె కలత
పాద మాడరాదు వుమ్మి చేదాయెను నోట
చెదిరె కనులలోని బూజు పాటిగుండె బీట
మరకలాయె నని వుడుపులు మనవిచేసికొన్నవి
మూజూడదు పో నాసిక రసికను కను లొల్లవు.

క్రుంగిన భుజ పీఠముపై అంగుళి స్పృశియించెను
తుళ్ళిగిల్లి పూడిపడిన క్రిమిమయ వస్తువుసు
వెళ్ళ కొచ్చినవి ప్రేవులు వెలిదూకెను శీఘ్రము
కళ్ళ తిరిగి పచ్చగిల్ల ఒళ్ళు తూలిపోయెను
కోలుకొనిన గుండె దాల్చి కాలు దారిపట్టెను
చలిచలిగా తోచి మేను పులకరింపు లుబికెను.

# 4

గవాక్షల కన్నుల తడి గాజులపై మంచు
గవాక్షల కృతజ్ఞతలు కొళల బంధించు
గ్రామపు సెగ నిట్టూర్పులు గోడ వెలువరించు
గ్రామీణుల కుశలప్రశ్న గాడుపు లందించు
తలుపు తత్తరిల్లి నిండు నీళ్ళ గిండ్లు రెండు
గాలిలోని తిళ్ళికె లటు కలగిన తడికళ్ళు.

ఆ కన్నుల కెంపు జూచి యీ కన్నులు దిగును
ఈ కన్నుల తెంపునెంచి ఆ కను లుబికేను
ఏదో నుడువబోయి లేత పెదిమలు వణికేను
ఏదో తెలుపబోయి కారు పెదిమలు ఆగేను
పాన్పుమీది పసికూనలపై వ్రాలును చూపు
పాన్పుమీద పవళించిన పాపలపై తీపు.

ఉడుపులను భుజించె నగ్ని ఉడుకణచెను ముసక
దడుపుల నగ్గించె నిదుర వేడిబడెను పడక
ముత్యాలను తాల్చి మేను మింటిని తోపించును
మూల్గు నీల్గు లతిశయించి మరపులు పైకొనెను
చల్లని చేతులగాజుల గలగల తరుచాయెను
తెల్లని మోమున ధారల వెల్లు లుబుకిపోయెను.

ఒంటి మీద వేయిన్నొక తంపటి కుండల కుతకుత
ఒంటి క్రింద కోటితపన బింబాలెగబోయు తపన
చిచ్చుసెగకు మరిగి కరుగు పక్షిగూటి పచ్చిగ్రుడ్లు
పెచ్చరిల్లి మెదటివేడి తాల్చిన భావాలు తెర్లు
మెరుపులు తరలిన కన్నులు కురిసెను దైన్యాలు
బిరుసెక్కిన కంచుకమ్ము చిరిగిన చిహ్నాలు.

కార్తిమూల కరిమొగిళ్ళు కాటుక తట్టి కరిగి విరిగి
ఆర్తి అనారత వర్షావాహినియై జృంభిస్తే
పడమటి కార్ఖానటి కొలిమి వెడలిన చెండగ్గి చెరిగి
కడనిబ్బర ముద్భ్రమ మార్తాండుడుగా జ్వలియిస్తే
వాన గిరస దొక్కినట్లు ఎండ వెంబడించు
వర్షాగ్రీష్మద్వైతము దృశ్యమాన మగుచు.

పూవు తొడవులను తాల్చిన తీవతనువు మురిసి మెరిసి
చివురు ముదురువేళ శీత శూలఘాత నొగిలిస్తే
పసిపిందెలు కసుగాయలు ఫలాలుగా దాచి కాచి
పసరాకులు తప్తహేమ భాసురమై దీపిస్తే
హేమంతుడు వాసంతిక హొయలణంచి వేయు
హేమంత వసంతా భేదము నామె వెలువరించు.

ఏ చరకుం డే జీవకు డీయగలడు దీని
నే మారుతులే సుశ్రుతు లీయగలరు దీని
నే ధేనువు లే ధాతువు లీయగలవు దీని
నే వేలుపు లే నేరువు లీయగలవు దీని
రాల కుప్పలో మెరిసిన రత్నము మిన్నందెను
ఊరి మెదడు వెలిగించిన ఔజ్జ్వల్యము లారెను.

త్రాసున తొడ కొంతకోసి దివికి తరలలేదు
తన వెన్నెముకను అసురాధిపున కీయలేదు
ఒక నాగునికొరకు గరుత్మంతుని కెరగాడు
ఒక ఇంద్రునికొరకు మేని నగల నొలుపలేదు
ఊరికి ఊపిరుల నూది వెలితిపడిన సంచి
మారికి మేనిచ్చి కీర్తి మృత్యోకాశము మించి.

తన నెత్తురు మరగు చమురు తన తనువే వత్తి
తోటి జగతి చీకటిల్లు తన ప్రాణము జ్యోతి
తా నెరిగిన ధర్మము జనతా జగతీశ్రేయము
తా నేర్చిన విద్య జగజ్జనతాసంసేవ
తను వొక కప్పురపారతి కనుక లోకనేత్రద్యుతి
కన్నులు చేపిన మిన్నులు కనుక జీవనస్యోద్గతి.

(కీ॥ శే॥ గాదిరాజు సుబ్బరాజు స్మృత్యంజలి)

# ప్రస్థానం

విప్లవ పద ఘట్టనతో వీధుల పెను ద్రోహ్యుడు;
దుర్గర్వోన్నత శిరముల దీటు నణచి కూల్చుడు;
నవ్యజల ప్రళయ మహా నిర్ఝరిణులు మనము
వార్షికాభ్ర సన్నిభులము పుడమిని క్షాళింతము!

దినములు దివ్యాశ్వమ్ములు
ఏళ్ళు కీడ్పుగాళ్ల
వేగము మన వేల్పు. ఎదురు
రొమ్ము మనది డమ్ము!

ధ్వజములు మనవాటి మించి దొడ్డవి మరిలేవు
చిరుతుపాకి గుళ్ళ తేళ్ళ చురుకు కొండె లదుమవు
సన్నీలకు రైఫిళ్ళకు మారు సమరగాథలు
పైడిగంట మ్రోతవంటి పలుకు తీరు మనది!

ఎదుగును పచ్చిక బయళల
కడచి చనును నాళ్ల
హరివిల్లా, వంగు! వల్గి
దశ్వాలూ, పొందు దౌడు!

చూడండటు. మిన్నుల చిల్లులట్లు చుక్కలు,
మిన్నున్నా లేకున్నా మ్రోగును పాటలు;
భల్లూకాకృతి గల్గిన సప్తర్షుల మండలమా !
బొందితోటి దివికి వేగ బోవలెనని చాటుము !

పాడుడు, మధువునిదే వాడుడు !
నాడులలో ఆమని ధుని !
స్పందించు. హృదీ, సంస్పందించు !
కాంస్యవక్షమా ! సంరావించు !

# లఘు వివరణ

## ఆవాహన

ఈ పాట సూర్య స్తుతి రూపం తాల్చిన మానవ హృదయ యవ్వన ప్రశస్తి, పాత దేవుళ్ళ స్థానే క్రొత్త దేవుళ్ళ నెన్నే ప్రయత్నం కాదిది. సూర్యుడు ఒక ప్రతీక (Symbol) మట్టుకే.

తప్తసింధువు = కాగిన సముద్రము.

హయధాటి = గుర్రపు దాడి.

సంభృత = చక్కగా కూర్చబడిన.

ఊష్మనిశ్వసన = వేడి నిట్టూర్పుల నెగయించువాడా.

ప్రభావసన = కాంతినే వస్త్రముగా తాల్చినవాడా.

గ్రీవము = గొంతుక.

అంశుకోదండ = కిరణములనే ధనుస్సులనుగా పట్టినవాడా!

జీవాగ్నిధానా = పూమొగ్గవంటి ప్రాణాగ్నిస్వరూపీ!

భూషాజ్వలత్పృథా = మండుచున్న వెలుగులనే నగలుగా ధరించినవాడా!

భూఫాల దీపా = భూమి నొసటి కాంతీ!

## ఇగుళ్ళు

చిటిపొటి వూహలు లేత కోర్కెలు కలగలిసి ఇగుళ్లుగా వ్యవహరింపబడినవి.

సుమపరాగము = పుప్పొడి.

వీచిక = అల.

## అ గ్ని పు ష్పం

స్వేచ్ఛాఫలాన్ని నిప్పుల పూవుగా సంభావించిన పాట. కల్ప వృక్షముగా స్వేచ్ఛ పేర్కొనబడినది: కాని అది యితరులకు వరము లిచ్చి వారిని బ్రతికించుటయే గాక, తానే మహాయుధాలు ధరించి ఆత్మ సంరక్షణంచేసుకోగల దిట్ట. తాను మని ఇతరులను మననిస్తుంది.

కచ్చ = కక్ష.

ఈసులు = ఈర్ష్యలు.

దినుసు = వాడుక వస్తువు.

ఊర్ధ్వముఖమై = ఎత్తిన మోము గలదై.

అస్రములు = నెత్తురులు.

## బా ధా గా థ ము

గద్యపద్య గుణాలను కూడగట్టుకొని, గొంతెత్తి చదివేందుకు అనువైన యీ కావ్యధోరణి కొత్తది. వచన పద్యాలనుకూడ అతిక్ర మించి. ఆవేశ స్ఫోరకంగా, అంతర్లయాన్వితంగా సాగిన యీ కావ్యం కావ్యోపన్యాసం అనదగినది.

ఆంధ్ర జాతి చరిత్రలో 1948 ప్రాంతాలలో రాజకీయోద్యమం, భాషా జాతీయోద్యమం, విశాలాంధ్రోద్యమం, నిజాం వ్యతిరేక-భూస్వామి వ్యతిరేకోద్యమాలు కలగలిసిపోయాయి. అప్పుడు నిజామాంధ్రలోను, సర్కారాంధ్రలోను ఎందరో ప్రజాప్రియులు ప్రాణం ఒడ్డి పోరాడి చని పోయారు; లేదా అజ్ఞాతవాసంలో అగ్గివగ్గిపోయారు; చెరలలో. శిబిరా లలో శిథిల శరీరులయ్యారు: ఆ కాలంలో వ్రాసిందీ కావ్యం. పశ్చిమ గోదావరి జిల్లా కమ్యూనిస్టు వుద్యమకర్త ప్రేరేప మృత్యుంజయుని అమరస్మృతికి దీని నంకిత మిచ్చాను, కాని అతనితోపాటు వీరమరణం పాలైన యావన్మందికీ యిది నా బాష్పాంజలి,

'గోదావరి' వుభయాంధ్రల సంధిసూత్రం; వధలకు వీరకథలకు సాక్షి; పావిత్ర్యాన్నీ ప్రజా సౌభాగ్యాన్నీ తనలో యిముడ్చుకొన్న దొడ్డ

తల్లి, ఈ నది పేరు యీ కావ్యంలో ప్రతీకగా గ్రహించి, యావదాంధ్ర దేశాన్ని ఆమెలో దర్శించబూనినాను.

భావనీరంధ్రవనులు = భావాలచేత దట్టమైన అడవులు.

రణాంగణం = యుద్ధం జరిగిన తావు.

విశృంఖల సంరంభము = అడ్డు అపులు లేని శివము.

గోస్తనీ రసం = ద్రాక్షారసం.

నిజాం గజాంకుశం = నిజాము అనే ఏనుగును పొడిచే అంకుశం.

ఘనీభూత దంభోళులు = గడ్డకట్టిన పిడుగులు.

బాధా గాథా సప్తశతి = బాధలనే గాథా సప్తశతి:

శబలోద్రేకతతి = రంగురంగు వుద్రేకాల గుంపు.

విమోచన .... లగ్నాలై = విముక్తి అనే సూర్యుని బిట్టెండకు తగుల్కొన్నవై.

## గ్రుడ్డి సంజ

ఇందులో వట్టి ప్రకృతి దృశ్య చిత్రణం చేయబడలేదు: ప్రకృతిని మానవీకరించనూలేదు; ప్రకృతికి మానవగతికి అభేదం సూచించడం జరిగింది. నిస్పృహ ఆవరించిన సమయాన వ్రాసినపాట.

అంధరథ్యములు = చీకటులను గ్రుడ్డిగుర్రాలు.

తమసము = చీకటి.

## చిట్టడవిలో చిన్నారి

ప్రపంచం మీద పరచుకొని. అడుగడుగుకూ దడిపిస్తూ, జీవిత ప్రశాంతిని పోకార్చుతున్న యుద్ధ ప్రమాదం నుండి మనిషి ఎలా బయట పడగలడనే తహతహతో యీ కావ్యం వ్రాశాను. ఇదికూడ "బాధాగాథం" వలెనే కావ్యోపన్యాస ధోరణికి చెందినది.

కేసరి = సింహం.

లతాంతము = పూవు.

ఉత్క్రమించెను = పైకెగసెను,

ఐరి = ఎల్ల.
ఇరుకు చెర = గోయి.
చూతశాఖి = మామిడి చెట్టు.
కర్మిష్ఠి = పనిలో దిట్ట.
అశ్రుసింధూ = కన్నీళ్ళ సముద్రము వంటివాడా!
విగతహితైషిబంధూ = మంచిని కోరేవారు, బంధువులులేనివాడా
రంగమార్తాండా = నటుడా!
జాలికలు = వలలు.
ఘోషాభీకమైన = ఘోషలచే భయంకరమైన.
ఘుర్ఘురారవఘోరమై = పంది అరపులవలె వినదగనిదై.
శమంతపంచకమై = క్షత్రియులను 21 పర్యాయాలు పరశురాముడు హతం చేసినప్పుడు ఏర్పడిన 5 నెత్తుటి మడుగులు.
శిఖరిణి = కొండ.
వియద్వీపద్వీధి = ఆకాశమనే ముప్పులు మోహరించిన వీధి.

## క్రిస్టోఫర్ కాడ్వెల్

1936 ప్రాంతాలలో స్పెయినులోని శిశు ప్రజారాజ్యాన్ని హత మార్చాలని సైనికాధికారులకు పట్టం కట్టాలని హిట్లర్, ముస్సోలినీలు విమానాలను, ఆయుధాలను, సేనలను అక్కడికి పంపినప్పుడు, స్పెయిన్ స్వేచ్ఛతో విశ్వశాంతి లంకెపడి వున్నదని గ్రహించిన దేశదేశాల స్వేచ్ఛాకాముకులు దళాలుగా ఏర్పడి, స్పెయిన్ యుద్ధంలో పాల్గొన్నారు. ఇంగ్లండునుండి వచ్చిన వారిలో యిత డొకడు. అప్పటికి యింకా కాడ్వెల్ చాలా పసివాడు. కాని ఆ నాటికే Illusion and Reality, Studies in a Dying Culture వంటి మౌలిక సాహిత్య విమర్శ గ్రంథాలే కాక, Crisis in Physics వంటి గొప్ప శాస్త్రగ్రంథాలు వ్రాసిన అసమాన ప్రతిభాశాలి. ఈ యుద్ధంలో ఆయన గతించాడు.

ఆర్తి = దుఃఖము.

లోర్కా = పూర్తిపేరు ఫెడరికో గార్సియాలోర్కా, స్పెయిన్ కవి. ఈ యుద్ధంలోనే ప్రజాప్రభుత్వ వ్యతిరేకులు యితనిని కాల్చివేశారు.

ఫణితి = వాక్యరీతి.

## వి శ్వ వ త్స ల

మానవుణ్ణీ, ప్రకృతినీ శాసించిన క్రమబద్ధగతిలో నడిపే విశ్వ రహస్యం యింకా మనకు పట్టుబడనిది ఒకటి వున్నది. దేవుడుమట్టుకు కాదు. ఆ శక్తి యీ గీతికలో వర్ణించడం జరిగింది.

ఆయుర్వాహినులు = ప్రాణ ప్రవాహాలు,

అమృతసదనమై = చంద్రుడై.

వినువాక = ఆకాశ గంగ.

తారకా = (కోరకిత....కుసుమిత) వల్లీ = చుక్కలనే (మొగ్గలను....పూవులను) తాల్చిన తీగెవంటి మేను కలదానా!

## అ ం గా ర-వ ల్ల రి

'బాధాగాధం' లో వర్ణించిన పరిస్థితులలో అసువులను కోల్పోయిన ప్రజావీరులను స్మరిస్తూ రెండేళ్ళక్రితం చాలచోట్ల ఉత్సవాలు జరుగుతున్నప్పుడు వ్రాసిన పాట. చీకటి కానుగపూగుత్తి అనే అర్థంగల 'అంగారవల్లరి' మృతిలో కూడ ప్రకాశించే వీరులను నిర్దేశిస్తుంది,

కంకాళధాత్రి = ఎముక గూళ్ళు పోగుబడిన చోటు, శ్మశానం.

వధావీధి = వధలు జరిగిన చోటు.

విర్జరము = ముసలితనము లేనిది,

పిపిన వకుళ సురభిళమాలికలో = అడవి పొగడపూల వాసనలే కూర్చిన మాలలో,

చదలింట = ఆకాశమనే యింటిలో.

అగ్నిశిఖ = కుంకుమ పూవు.

వజ్రి = వజ్రాయుధధారియైన ఇంద్రుడు.

దోర్దండ యుగళి = దండాలవంటి చేయిజంట.

నీరాజనము = హారతి.

కిమ్మీర వర్ణావృతము = పలు రంగులతో అలరింపబడినది.

పికీగీతి = కోయిల పాట.

కిశోరగర్జా నిర్ఝరి = సింగపుపిల్లల గర్జనలే కూడిన ప్రవాహం.

## విలయవీచిక

"చిట్టడవిలో చిన్నారి" లో వర్ణించిన పరిస్థితులలోనే, వేరొక సమయాన వ్రాసిన గేయం.

రుధిరోద్గారి = నెత్తురు వెలిజిమ్మేది.

శ్రీకంఠము = విషము కంఠాన తాల్చిన శివుడు.

గరళము = విషము.

## రత్నదీపం

పశ్చిమగోదావరి జిల్లాలోని పెదకాపవరం (భీమవరం తాలూకా) కమ్యూనిస్టుపార్టీ కార్యదర్శిగా వుండిన గాదిరాజు సుబ్బరాజు యీ కావ్య నాయకుడు. ఆ పరిసరాలలో వూరిలో మశూచి ముమ్మరించినప్పుడు, ఒక అనాధశవం వూరిలోపడి వుంటం చూచి, ఒక్కడై కూడ, భయంకర పరిస్థితులలో గూడ, దానిని మోసి గోతపెట్టి వచ్చిన ఫలితంగా, తనకూ తీవ్రంగా వ్యాధి సోకి మరణించాడు. కమ్యూనిస్టుపార్టీ యొక్క మేలిమిని తనలో నిలుపుకొని అనేక అగ్నిపరీక్షల్లో నెగ్గి చివరకు 1958 జూన్ 3 వ తేదీన మానవత్వపు పరీక్షలో ప్రథముడుగా ఉత్తీర్ణుడయ్యాడు. ఆ విజయం భౌతికదేహానికి పరాజయం! లోకశుభ్రతకోసం తన శుభ్రతనే కాక తన శ్వాసను అర్పించిన యీ అభినవ జీమూతవాహనుని స్మృతికి యీ గేయం మండే కన్నీటిబొట్ల మాల; కరిగే గుండెల హారతి.

సర్వంసహా = అన్నిటిని సహించే భూదేవి.

సతీశవము = దక్షుని కూతురైన సతీదేవి శవము: శివుని తొలి యిల్లాలి శవము.

భిషగ్వరుడు = వైద్యశ్రేష్ఠుడు.

దురత = మృత్యుదూత.

రాతినాతి = అమ్మవారి విగ్రహము.

విశీర్ణిల్లేను = శిథిలమౌను.

వృకము = తోడేలు.

శీద్రము = అసహ్యము.

తపనబింబాలు = సూర్యబింబాలు.

కరిమొగిళ్ళు = ఏనుగుల వంటి మబ్బులు.

అనారత వర్షావాహిని = ఎడతెగని వానకాలపు ప్రవాహము.

ఉద్భ్రమ మార్తాండుడు = పైపైకి గిరగిర తిరుగు సూర్యుడు.

వర్షాగ్రీష్మాద్వైతము = వానకాలము, ఎండకాలము ఒక్కటియైన భావము.

శీతశూల ఘాత = చలి అనే శూలపు పోటు.

తప్తహేమ భాసురమై = పుటంపెట్టిన బంగారంవలె వెలుగుతూ.

చరకుడు = ఆయుర్వేదంలో దిట్ట.

జీవకుడు = గొప్ప వైద్యుడు; బుద్ధునికాలపువాడు.

మారుతి = సంజీవనీ పర్వతాన్ని తెచ్చి లక్ష్మణుని బ్రతికించిన హనుమంతుడు.

సుశ్రుతుడు = ప్రాచీన శస్త్రవైద్యుడు.

ధేనువు = కామధేనువు.

త్రాసున...తరలలేదు = శిబిచక్రవర్తి.

తనవె....లేదు = దధీచి.

ఒక నాగుని....గాడు = జీమూతవాహనుడు.
ఒక ఇంద్రుని....లేదు = కర్ణుడు.
మృత్కోశము = మట్టి కూర్పు. అంటే ఒళ్ళు.
లోక నేత్రద్యుతి = ప్రపంచపు కళ్ళ కాంతి.
జీవసస్యోద్గతి = ప్రాణాలనే పంటల వృద్ధి.

## ప్ర స్థా న ం

ఇది రష్యన్ మహాకవి మయకోవస్కీ వ్రాసిన "The March" అనే గీతానికి అనువాదం. వీలైనంతవరకు మూలంలోని వాక్యాల తీరు చెడకుండా అనువదించ ప్రయత్నించాను. విప్లవకాలంలో వ్రాసిన పాటలో వుండవలసిన శక్తి, చేవ, తొందర, ఉద్రేకం దీనిలో వున్నాయి.

నిర్ఝరిణులు = ప్రవాహములు.
వార్షుకాభ్ర సన్నిభులము = వానకాలపు మబ్బులతో దీటైనవారము
శిథిలితము = కదిలిగెదము.
పైడిగంట = ఒకపక్షి.
హరివిల్లు = ఇంద్రధనస్సు.
వల్గిదశ్వాలు = దౌడుతీసే గుర్రాలు.
ఆమని — వసంతము.
ధుని — ప్రవాహము.
కాంస్యవక్షము = కంచువలె గట్టి ఎదురురొమ్ము.
సంరావించు = బాగా మ్రోగు.



# శుద్ధ పత్రం

✶

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 2 | 17 | సవ్యమార్తాండ | నవ్యమార్తాండ |
| 3 | 4 | ఖగాలు గూళులు | ఖగాల గూళులు |
| 5 | 15 | పసరాకులే వలువ | పసరాకు లేవలువ |
| 6 | 9 | నీళ్ళ నీలు | నీళ్ళ నీల్గు |
| 8 | 23 | నిబడ నిర్ఝరీ ! | నిబిడ నిర్ఝరీ ! |
| 10 | 1 | ఊబికి సేస్తున్నది | ఊబికి లేస్తున్నది |
| 13 | 10 | గర్భియై | గర్భయై |
| 13 | 11 | ఘుర్షారవ | ఘుర్ఘురారవ |
| 16 | 26 | వెలుగులనది మేచీకటి | వెలుగులనదిమే చీకటి |
| 20 | 17 | వరలె తూర్పు | వరలెను తూర్పు |
| 23 | 11 | దండించేనో . | దందడించేనో ! |
| 25 | 21 | రక్కసి పొల్లై | రక్కసి పొట్టై |
| 27 | 22 | ఒక గుట్టై | ఒక గుట్టై |
| 28 | 2 | ఆసులలోపల | అస్థులలోపల |
| 28 | 10 | పచగిల్ల | పచ్చగిల్లి |
| 30 | 4 | నేరువు | నేరుపు |
| 31 | 13 | పచ్చికబయళుల | పచ్చికబయళ్ళు |
| 33 | 10 | ఘుర్జరారవ | ఘుర్ఘురారవ |
| 37 | 5 | శాసించిన | శాసించి |
| 37 | 5 | కమబద్ధ | క్రమబద్ధ |
| 37 | 12 | మెను | మేను |
| 37 | 21 | పిపిన | విపిన |
| 38 | 11 | శ్రీకంఠము | శ్రీకంఠుడు |
| 40 | 11 | నిర్ఘరిణులు | నిర్ఝరిణులు |
| 40 | 15 | ధనస్సు | ధనుస్సు |
| 40 | 16 | వల్గి దశ్వాలు | వల్గితాశ్వాలు |